చినఁ దన చేతిలోఁ బడమిఁ జెన్నటి కన్నుల నీరు *నించి వం
(డి) వనలపాన్పుఁ జేరి విధిఁ దిట్టుచు వెచ్చగ నూర్పు నిచ్చెలిన్. ౧౭౯

క. ఉసుగని కన్నిర్వాఅవం, బసి జాతెకుళెయ్యఁ జూచి పాపపుదైవం
బొడలిచట విడువ × నీయఁడు, చెడఁజూచెనుఁ గటకటా యిసీ యనుదాన్.

ఉ. అత్తమొలుం జెలంగెను మహావసనంబు కరంబు చేగచే
హత్తి హరింప మున్ను మన సాదినవాఁడవు మచ్చులోటులన్
రిత్తమొల న్నలంగ విహరించుట నీమది కెగ్గ దోఁచునే
దత్తరకాఁడ యించనఁగఁ దగ్గియ నీవొనరించు టున్నఁడో. ౧౮౧

ఉ. పల్లవవృత్తి నీ వధరపల్లవఘాతకు మ్రొగ్గ నేటికో
పల్లవమున్ హసించు జిగిపట్టెడి యంచునొ తత్సరూపము
న్వల్లభ పంచమీనుటన వర్తిలఁజేసితొ యంచు నే నన
న్నల్లనఁ బాట మోవి నొని మేలగు కెంపులు నించు టున్నఁడో. ౧౮౨

చ. కలికి మిటారి గుబ్బచనుగట్టుల ప్రేమన కోర్వఁజాల వి
చ్చలు క్షణమాత్ర నామెడఁ బొనంగఁగ నిల్పెదనో సుధారసం
బు లొలుకనీక మోవి పలుమోపున నానుదునో యిఁ కేమి కా
వలె నది గూర్తు నంచుఁ దమివాటఁగ నిట్లలరించు టున్నఁడో. ౧౮౩

చ. తలఁపున నిల్పుచు న్మనుతఁ దాలిమి నిల్పఁగలేక కౌఁగిట
న్నిలుపున గ్రుచ్చి మోముపయి నెమ్మొగ మానిడి యమ్మోవి తేనియ
ల్పలుమొన లాని చెక్కుఁగవఁ బల్కుచు గీటుచు వంతఁ గేలిమై
యలరుల పాన్పుపైఁ † బెనఁగి యానుట యెన్నఁడొకో మనోహరా ౧౮౪

చ. మగని ‡ మెఱుంగుఁజేల మిటు మార్పఁగఁ గట్టితి వాతఁడు న్నయ
మ్ముగ భవదీయవస్త్రముల బూని నెఱుంగ రిదేమి వింత యిం
త గలవటే సమూటములు వాతిరొ నన్నకు నన్న పోయి పూ
ర్వగతిఁ బొనంగరాదె యని రామ లనంగ మెలంగు టున్నఁడో. ౧౮౫

చ. అని పలవించు దానిఁ దమ వారయు నెంతకడించి రోజ ది
ట్లును విడ జార యుం చిటునటుం బొరలాడెడుదాని నింక న
గ్గనివథరాత్మ దూఱికొనఁగాఁ బనియేమి దయుం దొలంగెఁగా
నెనరుడి నీలవేణి యని నెవ్వగ వెల్లి మునుంగు పైదలిన్ ౧౮౬

---

*నించె నెం......వల. × నిర్వాను ‡ వెఱపువాయుట- మూ. వెఱపువాయుటయును పవ
నమ్మును. † మెలంగు జేల-

గీ. సకలభూషణలక్షణసంగమంబు, నీకనాడుచుఁ జూడ్కికి వింత యగుచు
లలితవైఖరి గనియునబ్రంబుగాఁగ, సదృశవస్తు నిబంధన సడలు దాని. ౧౮౭

చ. అనయము మారుఁ డేయుపువ్వుటమ్ముల నెమ్ములు గాఁడి వాడి నె
మ్మనమున వంతఁ జింతిలుచు మక్కువఁ జెక్కిటఁ జేయుఁజేర్చి నె
క్కొను (పెను)వేదురందు ననుఁగున్నవలారతనంబుఁ జూచి గ్ర
క్కున భయవిహ్వలాత్మ యయి క్రొమ్మెఱుఁగారు మిటారికత్తెలన్. ౧౮౮

ఉ. సందడి చెందకుండ నొకచాటున నుంచియు నీలవేణి తా
ముందుగఁ బోయి కౌఁగిటను ముద్దియఁ *జేర్చి ముఖాంబుజంబుపైఁ
జిందునునుంగురుల్ జతగఁ జేరిచి చెక్కిట నిచ్చలంబుగాఁ
బొందిన మేలు కేల్దిగిచి పొందుగ విందులు సేంద నిట్లనన్. ౧౮౯

ఉ. అమ్మకచెల్ల చెల్వ క్షణమైన వయస్యలఁ బాయ వెన్నఁడై
నమ్మతి వారికన్నఁ దమి నాపయి నెక్కుడు గల్గుదాన వీ
విమ్మెయి నొంటి రాఁ దగునె యీకడుగోలవు నీకడింది చై
దమ్ము లిఁ కేమనందగుఁ బదమ్ములు పుప్పొడి కొట్టు లోర్చునే. ౧౯౦

ఉ. పల్లవసంగతి న్మెలఁగుపంచము లుండెడుచోటు మాటకే
యిల్లడ కైన చేరజము లీఁగెడుమాటు విషాళిపాటు అం
పిల్లెడితావు చూడఁగనె బెట్టు హరించెడిత్రుచ్చు హెచ్చి సొం
పిల్లెడునిక్క యక్క యిది భీతిల కిచ్చటి కేలవచ్చితే. ౧౯౧

క. నగువారి నెఱుఁగవైతివి, తగ వారడిపాలు సేయఁ దలఁచితి వమ్మా
మగువా యింతటి కట్టిడి, తెగు వాను మటంచు నెవరు దెలిపిరి తల్లీ! ౧౯౨

క. శయ మానుచుఁ జెక్కిట సం, శయ మానఁ బనేమికుసుమశరువలననదో
భయమా నవలా నీకు న, భయ మానలినాక్షుఁ డిచ్చుఁ బరమార్థముగన్.

చ. సకియ మరుండు నీదుకనుసన్నలవాఁ డటె యొక్కరుత్తుకై
పికము శుకమ్ము నీపలుకుఁ బేరిమి దాఁటఁగలేదు నీదు న
ద్త్రికనుగుణంబు సంచగమి; కీవి వసంతుఁ డలంతి నీవనీ
పకుఁ డటె సద్దచేయుచు భవాదృశ కిట్టులు రాఁగ నర్హమే. ౧౯౪

క. మొదట ననంగుఁడు మదనుం, డదనున విరియంగఁబాఱునట్టివి శరముల్
వదల వవి మృదులవిషమత, మదనువలన భీతి నీకు మది వలదమ్మా. ౧౯౫

* చెచ్చి.

ఉ. నీరసరాగదోషముల నీటు దొలంగఁగఁ దాఁ బయోరుహా
బీసచిరంపుఁ గన్నులను నీ దవఁగూరక యుంచుఁ దొత్తఁ ద
న్నీరజజాతికిం దపము నేఁడు ఫలించెఁ గదే కటాకటా
నీరసరాగము ల్గలిగి నీ టలు నీకనుకోలు సాటికా ౯౬

చ. చెలువరొ పూవుఁబోఁడి బయదిక్కని నైవరు మాన కెప్పుడు
న్మలయుచు నుంచుఁ బుప్పొడిసమారము నేరని నొచ్చితమ్మ సం
కులమదబాధరప్రకరకుట్టన నైనఁ దొలంగ కింతయుం
గలయఁగఁ బన్వె తేనెజడి* కాంతియు నూంతియు దాని నైఁచితే ౯౭

సీ. జలముల జీవించుజలజనాళంబులు దివుమందగతులు సంధిల్లుచోటు
నతిరక్తముఖర సంతతపత్కలధ్విన నడుసుకల్లరులు నక్తాముదిక్కు
కనుగొంపుఁగమఁ జొక్కపుతేఁటికుక్కాకిటి మనుపిసాసలు చెలఁగుచాయ
మలినచ్ఛదముఁ బూని మఘమూత్రవాసన సొక్కమత్తాళి పెంపెక్కువంక
యాటను మెలఁగంగఁ గటకటా యింటికి వచ్చి
తో ఘనమృణాలభుజకాండ యోసుబింబ
దళనవసన యోకిసలయతరుణచరణ
యోసురభిగాంగి నెమ్మది నోటలేక.

చ. మెలఁతరొ కృష్ణుపై మనసు మెత్తని దెంతకసింది యమ్మెనే
కలితమృదుత్వసంపదల గాదిలి చంద్రమమాను యాదిగాఁ
గలసుమమారవస్తువులఁ గా దను నిచ్చెలువంపుమేను నేఁ
డెల యింతవంటి బల్కటికి చేష్టలఁ బెట్టఁగఁ బట్టి నక్కటా. ౯౯

క. గురుశిక్షచే మహాగమ, గురుమర్మము గనియె మున్న గురుకుచ యిపుడుం
బరికింపఁ గనియె మన్మథ, గురుశిక్ష మహాగమంపుగురుమర్మంబుల్ ౧౦౦

గీ. అతిఘనాగమసంబంధ మతివ కమర
నతిఘనాగమసంబంధ మబలఁ గన్న
యినుఁడు చెందఁడొ చాయయు నెనయ లేదొ
కారణగుణంబు కార్యంబు గనఁగ రాదొ. ౧౦౧

గీ. కృష్ణునందు నరాగత గీలుకొన్న
యింతి కపరాగసాంగత్య మెట్లు పొసఁగు

---

* కారయు.

నెన్నఁగఁ బరాగ మెపుడు సహించునింతి
కిపుడు దాని సహించుట యెంతయరుదు. ౨౦౨

. విడుపి వథ్యశ్రీహితపదార్థవేత్రి నీవు, తండ్రిఁ బోలుచు మమ్ము సంతాపపడఁగఁ
జేయునేటికిఁ దల్లియగా ఛాయఁబోలి, చల్లఁజేయవె మమ్ములఁ జంచలాక్షి.

. ఇట్లు పల్కుచు నాలోన. ౨౦౩

. అక్కట యెందున్నైన హరిణాక్షులు చక్కనివారిఁ గోరరో
మక్కువ వెలింగి తండ్రి గరిమం బ్రియుఁ గూర్పఁగ వే రమింపరో
చక్కఁగఁ గూడి యిట్టికలఁ జాడలబూమెలు చూచినారమా
యక్కట నీకుఁ గల్గె నని యాడెదు చేడెలఁ జూచి వారలన్. ౨౦౪

చ. కనలుచుఁ బల్కి పల్కు కసుగందని ముద్దులగుమ్మ యమ్మనీ
మనమునఁ గోరుకొన్న యలమాధవు నీధవుఁగా ఘటించు నీ
జనకుఁడు *నేఁడొతేవొ యతిసౌఖ్యము నొందెదు తెల్లవారినం
గనుఁగొనువారు మెత్తురు వగర్గొని తెంపున కిట్లు చొత్తురే. ౨౦౫

చ. పొలఁతిరొ యాఁడుచందమునఁ బుట్టినవారికి నెల్లఁ గోరికల్
గలయవె నీకె యన్నటులు గాదిఁక నే మని యంటివేని పైఁ
దొలఁకఁగ నీక కూర్మి మదిఁ దొట్టిన గుట్టుగ మట్టు సేయుచు
న్నెలఁగుఁ పొలంతి యెన్నఁదగు మేటి నెలంతలలోనఁ ఖైదలీ. ౨౦౬

క. కన్నుల నీ రేటికిఁ దెలి, గన్నులచెలి కొన్నినాళ్లు గడవం దగవే
కన్నుల మూఁతం జేకొని, కన్నులవిల్తాని బారి గడచెదు పిదపన్. ౨౦౭

మ. అని సి గ్గెక్కఁగఁ బల్కినం దరుణి యత్యబ్జాక్షికఁ దంబున
న్ననుఁగేల్దమ్ములు గట్టిగాఁ బెనఁచి కన్నుంగోనఁ గ్రొవ్వేఁడినీ
ర్దొనఁక న్వాడినమోము దమ్మి చెలిమద్దుం జన్నుఁబూబంతులం
దను వొత్తిల్లఁగఁ జక్కఁ జేర్చి ‡రహించిందం బల్కు మందంబుగన్. ౨౦౮

†ఉ. కాఁకలుముంచు మేనుగలకట్టిడితండ్రికిఁ బుట్టునాకు నై
కాఁకలుగాక (సౌఖ్యములు గల్గు) నె యక్కట తప్పనంటేఁగా
కాఁకల కోసమై కొలఁతగాంచిన నోములు నోఁచునాకు బ
ల్గాఁకలు గాక యాజమున గాంచెన కాఁకలు తత్తనూజనై. ౨౦౯

ఉ. సావలుపట్ట నోర్చు నినుచక్కని కూఁతురఁ (గాళి మోరగా)
నూవక పొనలచ్చటల కోడని ‡యేటికి ముద్దుఁజెల్లెలా

---

* నేడెలెపె ‡రక. మూ †మూ రకెల పద్యముపోలిక. ‡యట్టి - మూ.

వానికి మూలమై జగతి నాశిక కోర్చినజేసితోఁడఁ గా
నేని భరింప నావశమె యిట్టి యమోఘదవాగ్నికీలలన్.        ౨౧౦

చ. ననుగనినట్టివారలకె నాపయిఁ గూర్మి యొకింతలేక య
వ్వనటఁ దొలంగఁజేయుట యవాస్తవమై యిటు లుండుకోఁగ ని
ష్వని మది మీకుఁ బట్ట దని పల్పడి చెప్పఁగనేల యిద్ది మీ
కఃభిమతంబ యేని రుచి*యబ్బునె గ్రక్కున నీదృశోక్తులన్.        ౨౧౧

క. అటువంటితల్లిదండ్రుల, నిటువంటి యనుంగుఁజెలుల నే నందుటఁగా
యిటు లావు దెసని కోరక, చిటుకుకు మనసుండ నమరి చెలువందితిఁగా.

ఉ. నీలరుచుల్ గ్రొలంకు సురనిమ్నగచెంగట దర్శచంద్రికన్
మేలగుదర్భివాదముల మెచ్చుగ నప్రజకన్నమూకు లే
వేళ నుతుల్ ఘటింతు రని వేలమదీయమనోవ్యథాభిదా
లాలనతం జనించి యఖిలాలితిఁ జెందెను మీమకీర్తులన్.        ౨౧౩

సీ. కన్నవారికిఁ జెప్పి కరుణ పుట్టఁగఁజేసి తలఁపు చేకూర్పరే తల్లులార
మీరైన వారికి నామేనితాపముఁ దెల్పి యతని నిం దవరే యమ్మలార
ము న్నిట్టికార్యంబుఁ జెన్నుగా ఘటియించు చెలువల వినరటే మెలఁతలార
భాగ్యవంతుల కిలఁ బ్రాణదానము మించు పుణ్యంబుగలదటే పొలఁతులార
నే వివేషించి మీదాన నెలఁతలార, మనసు మీదెంతకటికి యేచుగువలార
యనునయంబునఁ దీర్పనే వనితలార, తాళఁజాలను మీమాన తరుణులార!

సీ. నెతకింతకైనఁ దాళిత నరయా నేఁ జెల్ల నేనెంతకటికినే నీలవేణి
యాఁమఁబుట్టుకఁ జెందినట్టి యింతులకెల్ల నీలాగు లేదటే నీలవేణి
యొటువంటిపనినైన నీడేర్పఁగల వని నెమ్మి నమ్మితి నిన్ను నీలవేణి
కూర్మిచే నుండెడు కొమ్మలలోఁ జాల నెవరుదావవుగదే నీలవేణి
నీకు నెన రెందుఁ బోయెనే నీలవేణి, నేర్పుచేఁ గార్య మీడేర్పు నీలవేణి
యేల యీవట్టిమాటలు నీలవేణి, తాళ హరియాన యిఁక నేను నీలవేణి.

ఉ. చక్కెరవిల్తుఁ డేయుసుమసాయకపంక్తిఁ ద్రపాభిమానముల్
గ్రక్కునఁబోకమున్నె చెలికత్తియ మొత్తము సేయునారిడిం
చిక్కఁగఁ †బల్కు లంగడికిఁ జేరకమున్న ప్రియంబుగాఁ బ్రియు
న్నక్కున గారవింపఁ గలయంతకు నోఁచితినంట నెచ్చెలీ.        ౨౧౬

*యబ్బదె †బల్కులుఁడి!

సీ. మాధవాధరసుధామాధుర్యమునఁ దేలు వంశంబుజన్మంబు వడయనైతి
హరిభుజాంతరవాసనిరతి నింపార హారమణిస్వరూప నైయమరనైతి
యాదవమౌళిమోహాసితాపాంగకలాపంబు నై యేని రూపనైతిఁ
గమలామనోనాయకమనఃప్రియోద్దామమాధవినై యెట్లు మలయనైతి
నకట వీనిలో నేదైన నొకటినైనఁ, బొంగు నుబ్రియాంగసంగమాభంగసుఖము
తపనసుతనైతిఁ దావంబుఁ దలఁగనైతిఁ, జెలులు మీ చేతిరట్టు చేనలయనైతి.
క. వలపు పగవారికైన, న్వల దది యెటులన్న నట్టి వలపున మేనం
దోలఁచెనుఁ బ్రాణము లీగడె, నిలుపుట యేగండమయ్యె నిక్కము చెలువా.
గీ. ఒరులవెత యొరు లెఱుఁగ రౌ నర్వి ననుట
నిజ మనుఁగుఁజెల్వ లే రవ్వ నెఱపఁజొచ్చి
రకట మదితాప మిటు మీకు నరసి తెలియఁ
బడదు మోచు(వాఁడెఱుఁ)గుఁ గావటిభరమ్ము. ౨౧౯
చ. పతులను గోరు నల్లరకుఁ *బాటులివే యయినట్టులైన నీ
సతులు చెలంగి నన్ను నెకసక్కెము లాడుదురే యిదంత నా
కత యగుఁబోలు నట్లయినఁ గానిము ప్రాణము లిప్డు మేన ను
న్నతఁడే గదా యిఁ కెవ్వరు ననంగల యాడిక లజ్జఁ గోచనా. ౨౨౦
గీ. ఔర యప్రస్తుతప్రశంసాన్వితంబు, పల్కినను వ్యాజనిందానిబద్ధసూక్తి
లలితసంగతభావ నేర్పాలయనన్ను, మీకు నవ్వుటయెఱుఁగనెమలఁతలార
గీ. వనిత యర్థాంతరన్యాస మొనరు నెట్లు, మదికి నిరపేక్షవస్తుసమర్థనమున
మదికి నింపగుఁ గాదె సామాన్యఘటిత, భవ్యవస్తువిశేషసంబంధమమర.
సీ. కలదన్నఁ గలవానిఁ గలిమిచేడియతేనిఁ గరమున సుడివాలు గలుగువానిఁ
గడలినుండెడువానిఁ గరిఁగాచువగవానిఁ గరుణసిక్కెడుచూపు గాంచువానిఁ
గలికినవ్వులవానిఁ గౌస్తుభద్యుతివానిఁ గనఁగ నశక్యమౌ కతలవానిఁ
గనకంపురుచులీనఁ గలపచ్చడమువానిఁ గలుగుకాలం బెల్లఁ గలుగువానిఁ
గన్నెప్రేతలవయసులు గొన్నవానిఁ, గన్నులాతయు నవలీలఁ గన్నవానిఁ
గన్నులను†మంచుసెకమించుగన్నవాని, గాంతుగ నోఁచునకాంతకాంతకాంత
చ. అలదమయంతిఁ (బోలె) నను నంచితపుణ్య నొనర్పు మన్నలుం
దలఁపుము మాధవాప్రకృతతాకథనస్ఫుటభాగ్యగా నహో

---

*పాటియిదే †మించు

విలసితమానమాత్రమున విస్మృతి నొందకు మంచకైవశీ
వెలయుము తత్కృతోపకృతి వేగనొనర్చి క్రియానురూపతన్. ౧౨౪

వ. అని తరణితనయాతరుణి యమోఘశిఖాశిఖామణి యై పలుక నప్పలుకులు (ములుకులు) వోలె మదికి నులుకుచిలుక నచ్చిలుకలకొలికి యక్కలికికి ధైర్యంబు గుదుర నెనరు గదురం దియ్యందనంబు ముదుర నిట్లనియె. ౧౨౫

సీ. పంచత్వమే కాను బాణము ల్గాంచిన యతనుండు నిన్నేమి యనఁగలండు
*ఘనవైరమున మందగతిఁబూని వెల్లనౌ రాయంచగమి యేమి సేయఁగలదు
మధుసేవనంబున మాట పూను కీకాళివలనిభయంబు జేమి వచ్చు నీకు
మధుపత్వమున భూరిమాలిన్యగుణవృత్తి దేనుభృంగములు నీ కెదురురావు
బహుళపక్షవిరోధి యా పంకజారి, జడత గుణగంధమాత్రంబు వనయుగాలి
వెక్కసపుమాటలాడుచుఁ జిక్కుఁ జిలుక, యంతమాత్రంబునీకేలవంతతల్లి.

గీ. చెట్టు చెట్టున కొకకొన్ని చుట్టుకుండుఁ
జెలను చెలమకు నొకకొన్ని సేరుచుండు
మదనుసేవలు నీవంటిమానవతుల
ధైర్యకంచుక మగలింపఁ దలఁచునట్లు. ౧౨౭

మ. వెతనూపుంగమి నాలుపోఁగునను శ్రీవింగట్టుకుం దుంటనిల్
గడికొండ ల్పద గాముగాకి రసముం గావించు మీనాంకమున్
మనువంటం బకఁద్రోచి గాలములఁ గ్రుమ్మం జేసి కందర్పునిం
బకఁతీ దుర్బలుఁ జేసి పుచ్చెద భయోత్పాతంబు నీకేటికిన్. ౧౨౮

వ. అని యూఱడిలం బలికిన నప్పలుకులయెడ ననాదరంబు చేసి వెడనవ్వు నవ్వి యవ్వారిఁబోఁడి నీలవేణి కిట్లనియె. ౧౨౯

చ. కలికిరొ ప్రోవచేసియుప్రగాన నెఱుంగిక ఱొమ్మట దీరఁగాఁ
బలికితి విందె నీకు మఱుమాట వచింపఁగఁ జాలఁ గంతుపూ
ములుకుల మున్నె నాయెడలు మోహము దాఁకి తొలంగుఁ బ్రాణముల్
బలువగ నిల్పి యింతవఱఁ బట్టఁగలే నిఁక సిక్క మోచలీ. ౧౩౦

ఉ. కన్నులు మూసినట్ల పొడకట్టిన (నాథుఁడు) గాఁగి లీరయం
చున్నదువంగ నొరిగువఁ జూడఁగ†నీ దపు డేకముంకియో

*ఘనవైరమునఁ- †నీవపుడే

పన్నుచు వచ్చు నామప్రతిబంధము ప్రీడయు నంతలోన మే
నున్ననుచుం జలించునను గనుంగవ విప్పఁగ మాయ (మా) సఖీ. ౨౩౧

మత్తకోకిల. నీవు నామెకఁ గూర్మి బోటివి నెమ్మి నాపయిఁ గల్గినం
బూవుఁబోఁడిరో నాకుఁ గోరికఁ బొల్చు నొక్క రహస్యమే
చూవె నీమది నెంతలే దని చూడ కప్పని వేగమే
చేవ దప్పక తీర్చ దేనియుఁ జెప్పెద న్వాచు తత్ప్రియన్. ౨౩౨

వ. అది యే మని యంటివేని. ౨౩౩

శా. సాక్షాన్మాధవగాత్రసంగతికి నోఁచం గావునన్ దీని క
జ్జాక్షుం గస్తురివన్నె జృంభితసువర్ణాంభోజపత్రంబుపై
పక్షీణస్థితి వ్రాసి నన్నును దదీయాంచన్మహాహారస
ద్వక్షోమధ్యమపీఠి రూఢిగ లిఖింపం జూచి మైనం జెలీ. ౨౩౪

క. చిత్తరి చిత్తములోపలి, యుత్తల మొకకొంతమైన నుడిపెద నిటుగాఁ
జిత్తము నిలుపంగదవే, యుత్తమసుకృతంబు నీకు నొవరు వటంచుఁ ౨౩౫

చ. పలికి గళస్వరందరసబంధురగంధరసాంధబంధురా
కలితరవంబులం బ్రసవకమ్రవినమ్రరసామ్రతామ్రకో
మలనవపల్లవగ్రసనమంజుకపాయితకంఠకాకలీ
కలకలకంఠనాదములఁ గప్పి తటాలున నుప్పి యప్పియున్. ౨౩౬

వ. అప్పు డప్పల్లవపాణి కపటకోపికాపల్లవాయల్లక మెల్లం...దురంతసంతా పంబున నెంతయు నొల్లంబోయిన నీలవేణి తోడి నీలవేణులం గూడి కటక టంబడి చింతించి యీయింతికి సంతాపంబు బలవంతం (బలంతుల) నంతం బుఁ జెందనేర దీమెకఁ గొంతకొంత శాంతింబొంద శిశిరోపచారంబులు పచ రింపం దగు ననినఁ దత్సహితలై తత్సహితలు తత్ప్రియాయత్తచిత్తలై ర య్యవసరంబున. ౨౩౭

—కాళిందికిఁ జెలులు శిశిరోపచారములు చేయుట—

ఉ. తావుల మోక*మావిగమి తావుల గొజ్జగనీరుయంత్రముల్
క్రేవలఁ జిల్కఁగాఁ జిగురు †గేదఁగిపూదడిగట్టి వట్టివేళ్
పై వఱలారు చెంగలువపందిరి చెందొవరేకవంటి క్రొ
మ్మోవులచందువా పొగడ మొగ్గల నిగ్గులచప్పరంబులోఁ ౨౩౮

*మామిగమి †గేదడిపూదడి

సుగంధి. కప్పురంపుఁదిప్ప నొప్పుఁ గప్పుపైఁడికప్పు మే
ల్పుప్పొడి స్రవించినట్టి పువ్వు సెజ్జమీఁదికిన్
అప్పుడంతిఁ దెచ్చి, తెచ్చి రంబుజాక్షు లందఱుం
జెప్పరాని వేగ మూని శీతలించు వస్తువుల్. ౨౩౯

ఉ. పారసచందనైణమదసంకుమదాగురుకేసరాళిక
ర్పూరపరాగకుంకుమసముజ్జ్వలపల్లవమల్లికాచ్ఛిక
హ్లారతుషారనీరబిసహారసమంజసపుష్పమంజరీ
హారము లాదిగాఁ గొనుచు వచ్చి కరం బుపచారుసేయుచున్. ౨౪౦

చ. మలయజకర్దమం బొకల మాటికి నలంది మృణాలవల్లరీ
వలయచయంబు లంఘ్రులను బాహువులం గదియించి వేసవి
న్నెలయుఁగఁ దెల్లదమ్మి యుకి పిల్లగఁ గస్తురి కంధరంబునం
గలయఁగఁ బూసి యింతి శిరస్సైనదిఁ జేసి రనంగభీతిచేన్. ౨౪౧

చ. మృగమదచర్చ యంగకము మేన నలంది పరాగరాగసౌ
భగకదళీదళంబుఁ గటిపై నిడి చెంగలువపుష్పటుత్తుఁ బొ
ల్పుగ నెదనుంచినప్డు సతి పొల్చె ననారతకామభక్తియో
గగురునిజాంతరంగ యమరంగాఁ దదాకృతి దాల్చెనో యనన్. ౨౪౨

ఉ. అంగజుఁ డంగనాఘనహృదంతరకర్పరసీమ స్నేహమ
బ్బంగి వళంగురం బగుచు భాసిలఁగా దరిపై దళాంతరం
బుం గదియించి త్రోఁచఁ బరిపూర్ణతఁ గాంచి యమదోగదీప మే
చం గడు స్రుక్కుచుం గినలసంఘటితవ్యజనానిలంబునన్. ౨౪౩

సీ. పదములఁ జిగురాకు లొదవించి జంఘల స్మరతూణతిలకము ల్మరుప్రకొల్పి
తొడల నరంటిద వ్వడరించి సొబగారుకటిపైఁ బరాగసైకతము నించి
నడుమఁ బుష్పరథంగి దొడరించి యూరున జాఁకగాఁ గస్తూరిరేక దీర్చి
చన్నుల గుచ్ఛము ల్పనరించి నెమ్మేనఁ జందనం బలఁది భుజంబుల బిస
కాండమిడి చెక్కులను జంద్రఖండములఁ దీ, వేణి శైవాలమునఁ గూర్చి వెలఁదియంగ
సామ్యపదనత్పరీతిఁ ద్విచారణ బలెఁ, దెల్వ లీరీతిఁ జేసిరి శిశిరవిధులు.

చ. ఎడపక యింతులెల్లఁ గదియించినపల్లవసూనగుచ్ఛముల్
తొడరి వియోగవహ్నిపైఁ దొట్టఁగ *జప్యన పీచుదీసి మె

* జన్వ

క్కున గమలంగ నవ్వె కలకోమలిగాత్రము వొల్చె నామకుం
డనరుచు దోహదక్రియకునై †కవశించిన లేఁతలీవనాన్. ౨౨౫

ఉపతాపవిహాలద్ధ్రుపల్లవంబుల మిశ్రకరమార్జనక్రియఁ గలుపరాదు
పగఁ బొగల్లాని మాట లెగయుదెందంబునఁ జంపకస్నేహంబు సలుపరాదు
కన్నీటివఱదలు గ్రమ్ము చన్నిట్టల ఘనసారజలధార లునుపరాదు
నిట్టూర్పువడగాలిఁ బట్టూరు కైందీఁగ నల వహ్నిశిఖ నిల్పఁదలఁపరాదు
చండమగు కాండతేజః ప్రచండకిరణ, దండవిధవ
మోహబహుళాంధకారంబు ముంచిజాలి, మృగమదంబునఁదిలకమర్పింపరాదు

అతనుతాపంబు హరియింప నంగములను, జెలులు సేర్చినబహువిధశీతలములు
నతనుతాపంబు హరియించెనంగవితతి, నతనుతాపంబుహరియింపనబ్బురంబు

జడములగుటను సంతాపశాంతి సేయ, నంచుఁ జెలులేలయిడిరిసుమాదికములు
జడతఁ గాంచినద్రవ్యముల్ జగతినియతి, గలవు సేయఁగఁ దన్మహాకార్యమెల్ల

తనులతఁ బల్లవసుమములు, ఘనతం గొనుసేని యతనుఘనశిఖ యేచెం
దనులతతాపం బడఁచునె, ఘనములు నవియెన్ని కృష్ణఘనమే చిక్కన్.

ఈవిధమున నేర్పొప్పఁగ, వారిరి శిశిరోపవిధులు వర్తించి యొకిం
తా వెలఁదిఁ దెలిపి నగరికి, వేవేగం దోడి తెచ్చి వెలఁదులు ప్రీతిన్.

పసిఁడియుప్పరిగె నునుబూఁబాన్పుమీఁద
నకియ నిరవొందనునిచి హెచ్చరికమిగులఁ
గలితపూర్వకథాప్రసంగంబుచేతఁ
బ్రొద్దు గడపుచు నుండిరి ముద్దుచేసి.

మాయానహోయసీతా, జాయానిరపాయధవ్యసాకేతపురా
ధేయ మునిగేయ జలద, చ్ఛాయులసత్కాయ సకలజగదున్నేయా. ౨౭౨

ద్యము. ఇది శ్రీమద్రామచంద్రచరణారవిందమిళిందాంతఃకరణపోలూరి మాధ
వయజ్వసముజ్జ్వలత్కృపోక్షిత కటాక్షోపాదిత పాండిత్యాభరణ ప్రభంజన
వంశాబ్ధిరాకాశశాంక నిరంతరారాధితవిచక్షణశశాంక అభినవ నన్నయభ
ట్టారకాహోబలపత్యాహ్వయకవి మహోపాధ్యాయ భట్టారక ప్రణీతం
బైనకాళిందీకన్యాపరిణయంబనుమహాప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము.

---

† [illegible]

శ్రీరస్తు

# కాళిందీకన్యాపరిణయము.

## తృతీయాశ్వాసము.

క. శ్రీరాజమౌళిహృదయ, ప్పారాంబుజచంచరీక ప్రణమజ్జనతా
ఘోరాఘతిమిరదినకర, తారావల్లభవిరామ దశరథరామా. ౧

వ. మహాత్మా దివ్యచిత్తంబున నవధరింపుము. ౨

### — సూర్యాస్తమయవర్ణనము. —

క. అంతట నంతటి నిచ్చెలి, యంతర మగలంగఁ గూఁతుఁ గలయుట గనుచుం
గాంతి దొలంగుచు వ్రాలెను, జింత నవం దనదు కాంతి చెదరఁగ వ్రాలెన్

గీ. వారుణీసేవతనకు దుర్వార*మహిమ, యంతకంతకుఁ దలుగనొయ్యన వెనుకకు
మేరు†నొగులంగ నవ్వుచు భానుమంతు, డధిక(దీన)స్వరూపంబు నధిగమించె.

సీ. అనురక్తమండలుం డగుచుఁ బూర్వాగమ మూని ప్రబోధ మింపొప్పఁ జేసి
సర్వవర్ణాశ్రమాచారము ల్నడిపించి తా సత్పథంబునఁ దనరి నిలిచి
నలుదిక్కులను గరంబుల(చేత) నలరారి చక్రసద్విజవృత్తి చక్కనునిచి
కుముదంబులకుఁ బొంగు గ్రుంగునట్లు మెలంగి పద్మిని కామోదపటిమ గలిపి
కాలగతి వసించినఁ గడఁకదక్కి, కాంతిగైకొనియుపరాగమొంతమంది
వసువు శుచికిచ్చి పరరక్తభావ్యుఁడగుచు, వఱలువావంద వారిధి వ్రాలెనినుఁడు.

గీ. ప్రాచి పశ్చిమదిశ యందు జేపట్టి యూఁచు, బంతిగాఁ దత్కరచ్ఛవివట్టెసూర్యుఁ
గానిచో నెద్దికరతమన్యకాల మెకయు, నరుణిమచ్ఛట నంజలఁ బరఁగుచుండ.

గీ. చండమార్తాండరోచిరఖండవహ్ని, కీల నంతయుఁ గ్రాఁగినఁ జాలఁజాల
నరుణిమభజించె నాజరఠాతపమున, దంకినెఱు పెక్కె బ్రహ్మాండభాండ మెల్ల

క. కొండలకు మేలుబంగరు, కొండలరాయనికి మైత్రి గావకొనఁ జివురుల్
మొండుకొనుమావులకు దరు,మండపములకు నట్టిమొడఁ గచాకచి యమరెన్.

మ. తను లోకంబులు లోకబాంధవుఁ డనం దాఁగర్మసాక్షిత్వముం
గొను చత్యున్నతిఁ గాంచి కాలగతిచేఁ గుంఠితవత్తేజుఁ డై
చని యవ్వారుణిసేవ గైకొనియె నష్టప్రాయుఁ డట్లాటచేఁ
గనిమెరా ఘోరగభీరవార్ధిపతనాకారోదుపాలిత్యముల్. ౩

---

* పతిజ. † కొంగడుఁగ.

సీ. సకలజగచ్చరజంతుసంతానసంతతనేత్రదృష్టిసంతతులతోడఁ
చక్రాంగదాంపత్యసరసాభిలాషసంఘటనైకహేతుభాగ్యంబుతోడఁ
దనుధారణక్రియాధావదుచ్చావచపథశ్రమభృద్వ్యావృత్తిభరముతోడఁ
బద్మినీముఖపద్మషట్పదవ్రాతరామోదకారణాదృష్టవైఖరులతోడ
నస్తమించెను జలరాశి నతిరయమున, వనధిజల మెల్ల నధికపావనతఁ జెంద
దొలుతనుషీవకునుదుపులఁ గడలుకొనెను, బెడఁగుఁబోఁడిమి గైకొన్న పెద్దవేల్పు
గీ. అస్తగతురీతి జనులదన్నస్తగతుగఁ, జలుపఁ గైరి పితృప్రసూసంగియనుచుఁ
గలువమదివోవఁ గడిగికొవలయు ననిరొ, వనజమిత్రుండు వేగంబ వనధిమునిఁగె
సీ. ఇనపాతకృత మైనఘనవివరంబునఁ బైకెన్క బాడబప్రభ యనంగ
జలములోనుండి యుబ్బులఁ ద్రోవ మీఁదికిఁ బొంగు లేఁబవడంపురం గనంగఁ
గాలుండు జక్కవకవ మది నేర్చఁగఁ జాతించి పొడమించు చిచ్చనంగఁ
గుముదిని నిద్ర పైకొనకుండ వవరాశి వెలయించు దీపంపువెలుఁ గనంగ
నపుడుసూర్యుండు హాటకాటనతనితోడఁ, గొంతదవ్వేగియతఁ డబ్ధిఁ గ్రుంకిపోవఁ
దీరమున నిల్చి గరుడని తేటయనఁగ, నింపుదళుకొత్తె సాంధ్యరాగంపుసొంపు.
చ. అరయఁగ సర్వమిత్రుఁ డగునట్టి యినుం డరుగంగ నింక మా
కిరవులు సేరి సద్దడఁగి యేకతి యుండెడివేళయే నిశా
చరుఁ డధికారి శాద్యసులె సౌఖ్యము గాంతు రటంచు సంకుల
స్వరములు సేయుచు న్విహగజాలము సేరెఁ గులాయసీమలన్. ౧౩
ఉ. తారలఁ బెండ్లియాడఁ బ్రమదంబున రా జరుదేర నింపు సొం
పార నభోరమారమణి యాకసపుంబలువేదిమీఁద వి
స్తారముగాఁగఁ గల్పసుమజాలము నించెను నా నభంబునం
దారక లుల్లసిల్లెఁ గలితద్యుతు లెల్లెడఁ బర్వుచుండఁగన్. ౧౪
క. చండాతపతప్తదిశా, కుండాలము లుదధిఁ గ్రుంకి కుంభచ్ఛ్వాడా
దండములఁ బైకిఁ జిమ్మఁగ, నిండెను శీకరము లనఁగ నెఱసెం దారల్.
చ. వగ లొనరించు చగ్రకరభావము గైకొని మమ్ము నేఁచుచుం
డగు లయినట్టిపంకజవితానము నేము నిరుండు వోయె నె
వ్వగ మది మాకు మానె ననివారణ శీతకరుండు రాజు దా
నొగిఁ జనుదెంచు నంచుఁ జెలువొందెను మిన్నునఁ దారకావ్రజల్. ౧౫

| ధాతువు | | సంస్కృతార్థము | తెలుగర్థము. |
|---|---|---|---|
| కొను | స | గ్రహణే<br>క్రయణేచ | గ్రహించుట<br>క్రయముసేయుట |
| కొనుక్కొను | స | స్వార్థక్రయణే | తనకైక్రయముసేయుట |
| కొనియాడు | స | స్తుతౌ | స్తుతియించుట |
| కొనిపోవు<br>కొంపోవు | స | గృహీత్వాగమనే | గ్రహించుకొనిపోవుట |
| కొఱుకు | స | దంశనే | కఱచుట |
| కొఱలు | అ | పూర్త్తౌ | నిండుట |
| కొలు | స | మానే | మానముసేయుట (ధాన్యాదులుకొలుచు) |
| | | సేవాయాంచ | సేవించుట |
| క్రొవ్వు<br>కొవ్వు | అ | మదే | మదించుట. |
| కొసరు<br>కొసను | స | అతికాంక్షాయాం<br>దానానంతరం పునఃకించిద్దేయమితిప్రార్థనాయాంచ | మిక్కిలికోరుట<br>ఇచ్చినవెనుక మరలఁ గొంచెమిమ్మనిప్రార్థించుట |
| కోదు | స | తండులాదివివేచనే | బియ్యము మొదలైనవానిని బృథక్కరించుట |
| కోపగించు | అ | కోపే | కోపపడుట |
| కోయు | స | పుష్పాద్యవచయే | పుష్పాదులు చెట్లలోనుండి గ్రహించుట |
| | | లవనే | పైరుమొదలైనవికోయుట |
| కోరు | స | కాంక్షాయాం | కాంక్షించుట |
| | | వరణేచ | వరించుట |
| కోరుకొను | స | వరణే | వరించుట |
| కోరాడు | స | వరాహాదీనాంమృదాద్యుత్ఖాతవికిరణాదౌ | పందులుమొదలైనవి మట్టిత్రవ్వియీవలనావలవెదచల్లుట |

| ధాతువు | | సంస్కృతార్థము | తెలుఁగర్థము. |
|---|---|---|---|
| క్రోలు | స | పానే | త్రాగుట |
| కోల్పడు | అ | స్వార్థవ్యయనాశనే | పోఁగొట్టుకొనుట |
| కోల్పుచ్ | స | నాశనే | నశింపఁజేయుట |
| కోలుమసఁగు | అ | విజృంభణే | విజృంభించుట |
| కోల్తలఁజేయు | స | రణోద్యోగకరణే | రణోద్యుక్తముగాఁజేయుట |
| కొను గ్రా | స | ప్రాగన్యదీయ స్యార్థస్య కార్యస్య వా స్వవశీకరణే | మున్నొకనిదిగానున్న యర్థమునైనఁ గార్యమునైన స్వవశముగాఁ జేసికొనుట |
| కౌఁగిలించు | స | ఆలింగనే | ఆలింగనము చేసికొనుట |

## గ

| ధాతువు | | సంస్కృతార్థము | తెలుఁగర్థము. |
|---|---|---|---|
| గ్రక్కదలు | అ | భృశచలనే | మిక్కిలి కదలుట |
| గట్టించు | స | ఘట్టనయాపూరణే | ఘట్టనచేసిపూరుట |
| | | ఫలకే మష్యాదినా పూర్వ రూపవ్యపనయనే చ | పలకమీఁదమసి మొదలైన వానిచేత మొదటిరూపు మాపుట |
| గడు | అ | అతిక్రమణే | అతిక్రమించుట |
| | స | లంఘనే చ- గ్రా | దాఁటుట |
| గడించు<br>గణించు | స | అర్జనే | ఆర్జించుట |
| గండరించు | అ | ఆవిర్భావే | ఆవిర్భవించుట |
| గడెఁదేరు<br>గడెఁదీరు | అ | ప్రౌఢతాయాం | ప్రౌఢుఁడౌట |
| గతుకు | స | కవలఆస్వాదే | కుక్కి యాస్వాదించుట |
| గంతుగొను<br>గంతుగొట్టు | అ | మృతౌ | చచ్చుట |
| గడుము<br>గడుముకొను<br>గడుచు | స | ప్రాప్తౌ | పొందుట |

| ధాతువు | | సంస్కృతార్థము | తెలుగర్థము. |
|---|---|---|---|
| గదురుకొను | స | ధర్షణే | ధర్షించుట |
| గద్దించు<br>గదమాయించు (గ్రా) | స | ధిక్కారే | ధిక్కరించుట |
| గద్దరించు | అ | ముఖాదేరుచ్ఛూనతాయాం | ముఖము మొదలైనవుబ్బుట |
| గలతరించు | అ | ఆకస్మికపులకోద్గమే | ఆకస్మికముగా గగురుపొడుచుట |
| గలవరించు<br>గలబరించు | స | పాత్రజలవిలోడనే | పాత్రలోనీళ్లుకలియఁబెట్టు |
| గాఁడు | స | వేధనే | బాణాదులచేత గ్రుచ్చుట |
| | అ | విద్ధతాయాంచ | బాణాదులుఁగ్రుచ్చుకొనుట |
| గారవించు | స | ప్రీణనే | ప్రీతిసేయుట |
| గాలించు | స | పాత్రే జలేవతండులాదిషుపాషాణశోధనే | పాత్రలో జలముచేత బియ్యము మొదలైన వానిలోని రాళ్లుశోధించుట. |
| | | మార్గణేచ | వెదకుట |
| గిచ్ | స | నఖతోదనే | గోళ్లతోరక్కుట |
| గింజు (గ్రా) | స | కార్పణ్యయాచనే | కార్పణ్యముగ యాచించుట |
| గింజకొను<br>గిజగిజలాడు | అ | ఆపదాహస్తపాదాదికర్షణే | ఆపదచేతఁ గాలుసేతులు నీడ్చికొనుట |
| గిట్టు | అ | మృతౌ | చచ్చుట |
| | | సమ్మతౌచ | సమ్మతమౌట |
| గిఁటిగొను | స | పరివేష్టనే | చుట్టుకొనుట |
| గిలుబాను | స | చౌర్యే | దొంగిలించుట |
| గిల్లు | స | అంగుష్ఠతర్జనీభ్యామూర్వాదావద్గ్రహణే | అంగుష్ఠతర్జనులచేతఁదొడ మొదలైనచోటులఁ జర్మమునుబట్టి లాగుట |
| | | నఖక్షతకరణేచ | నఖక్షతముసేయుట. పండ్లు గిల్లెను |

| ధాతువు | | సంస్కృతార్థము | తెనుఁగర్థము. |
|---|---|---|---|
| గీచు | స | రేఖాకారక్షతే | రేఖాకారముగాక్షతముసేయుట |
| గీటు | స | అపనే | చిమ్ముట |
| గీటుకొను | స | సంకేతే | సంకేతముసేయుట |
| | | ఛద్మనామారణేచ | ఛద్మనఁగాఁజంపుట |
| గీటడఁచు | స | మారణే | చంపుట |
| గీయు గ్రా } గీరు | స | రేఖాలిఖనే | రేఖగావ్రాయుట |
| గీఱు | స | ఫలాద్యాస్వాదనభేదే | దంతములతో ఫలాదుల నుజీఁకుట |
| | | బాణప్రయోగే | బాణములుప్రయోగించుట |
| | | ప్రహారేచ | ప్రహరించుట |
| గీఱుకొను | స | సంకేతే | సంకేతముసేయుట |
| గ్రుంకు | అ | హ్రైస్వే | తగ్గుట |
| | | మజ్జనే | మునుఁగుట |
| | | అస్తమయేచ | అస్తమించుట |
| గ్రుచ్ } గుచ్ | స | శలాకాదీనామంతః ప్రవేశే | కడ్డిమొదలైనదానిని లోపలికిఁ దూర్చుట |
| గుంజు | స | హఠాత్కర్షణే | బలాత్కారముగా నీడ్చుట |
| | | వాసస్సంహత్యపాణిభ్యాంనిర్ణేజనేచ | బట్టముద్దగాఁజేసి రెండుచేతులతో నుదుకుట |
| గుజగుజలాడు | అ | మిథోజల్పనే | ఒకవిషయమై రహస్యముగాఁ గుంపులుగూడి మాటలాడుకొనుట. |
| గుంజులాడు | స | హఠాదన్యోన్యకర్షణే | బలాత్కారముగా నొకనినొకఁడీడ్చుకొనుట |
| గుటుక్కను గ్రా } గుటుకువేయు | అ | మృతౌ | చచ్చుట |

| ధాతువు | | సంస్కృతార్థము | తెలుఁగర్థము. |
|---|---|---|---|
| గుండ్రించు | అ | పిత్తోషేణఆంత్రభ్రమణే | పిత్తముచేతఁ బ్రేగులుదిరుగుట |
| గుద్దు | స | ముష్టిఘాతే | పిడికిటంగొట్టుట |
| గుద్దులాడు | స | అన్యోన్యముష్టిఘాతే | ఒకనినొకఁడు గుద్దుకొనుట |
| గుద్దలించు | స | కుద్దాలేనఖననే | గుద్దలితోఁద్రవ్వుట |
| గుదియించు | స | అవస్థాపనే | నిలుపుట |
| గుదగుదలాడు | అ | సగద్గదరోదనే | డగ్గుత్తికతో నేడ్చుట |
| | | మిథోజల్పనేచ | ఒకనివిషయమైరహస్యముగా గుంపులుగూడి మాటలాడుకొనుట |
| గునియు | అ | ప్రీతివిస్రంభాభ్యాం మందకూచనాయాం | చనువుచేత మెల్లమెల్లగా సదుగుట |
| గుప్పు | స | గాఢావఘాతే | గట్టిగాదంచుట |
| గుప్పటించు గ్రా<br>గుప్పిలించు | స | వాసస్స్నాహత్యపాణిభ్యాంనిర్ణేజనే | బట్టముద్దగాఁజేసి రెండుచేతులతో నుదుకుట |
| గుంపించు | స | ఈర్ష్యయావికృతభాషణే | ఈర్ష్యచేత వికారపు మాటలాడుట |
| గుబాళించు | అ | ప్రకాశే | ప్రకాశించుట |
| గుబుకు<br>గుముకు | స | ముష్టితాడనే | పిడికిట-తాడనముచేయుట |
| గులుకొను | అ | ఉద్యోగే | ఉద్యోగించుట |
| గులువెట్టు<br>గుఱ్ఱువెట్టు | అ | నిద్రాయాంకంఠఘోషే | గుఱకవెట్టుట |
| గుఱ్ఱు | అ | అసమ్మత్యాకోపే | అసమ్మతిచేతఁ గోపించుట |
| గుసగుసలాడు | అ | ఉపాంశుమంత్రణే | రహస్యముగా నాలోచించుట |
| గెంటు | స | నోదనే | త్రోయుట |
| | అ | విషమచలనేచ | ఎచ్చుతగ్గుగాఁగదలుట |
| గెంట్లు గ్రా | అ | విషమచలనే | ఎచ్చుతగ్గుగాఁగదలుట |
| గెట్టించు గ్రా | స | ఘట్టనయాపూరణే | ఘట్టనచేసికూరుట |

| ధాతువు | | సంస్కృతార్థము | తెలుఁగర్థము |
|---|---|---|---|
| | | ఫలకేమష్యాదినా పూర్వరూపవ్యప నయనేచ | పలకమీఁద మసి మొదలైన వానిచేత మొదటిరూపు మాపుట |
| గెలు | స | జయే | జయించుట |
| గెడించు | స | బహిరకనోదనే | అవతలికిఁద్రోయుట |
| గేలించు | స | అపహాసే | అపహాసముచేయుట |
| గ్రోచ్ | స | ఖననే | త్రవ్వుట |
| గొణుఁగు, గొనుఁగు | స | ఉపాంశుజల్పనే | తనలోఁదాను మెల్లగా మాటలాడుట |
| గొరుగు | స | క్షురకర్మణి | క్షౌరముచేయుట |
| గోఁకు | స | కండూయనాదౌ | దురదతీరునట్లు గోళ్ళతోఁగీచుట (కుండగోఁకెనను) |
| గోజు, గోజులాడు | స | ముహుర్వివేచనే అవిమోచనేచ | మాటిమాటికి వివేచించుట విడువనివాఁడగుట |
| గోజరు | స | ముహుర్యాచనే | మాటిమాటికి యాచించుట |
| గోలించు | స | స్నేహభర్జనే | చమురుపోసి వేయించుట |

చ

| | | | |
|---|---|---|---|
| చక్కాడు | స | మారణే | చంపుట |
| చచ్ | అ | మృతౌ | మృతుఁడౌట |
| చతికిలఁబడు, చదికిలఁబడు | అ | విశీర్ణపతనే | కూలఁబడుట |
| చదియు | అ | చూర్ణీభావే | చూర్ణమగుట |
| చదుపు | స | మారణే | చంపుట |
| చదువు | స | విద్యాభ్యాసే పఠనేచ | విద్యయభ్యసించుట పఠియించుట |
| చను | అ | గమనే అర్హత్వేచ | పోవుట తగుట |
| చనుదెంచు | అ | ఆగమనే | వచ్చుట |
| చప్పరించు | స | ఆస్వాదవిశేషే | రుచిచూచుట |

| ధాతువు | | సంస్కృతార్థము | తెలుఁగర్థము |
|---|---|---|---|
| చమురు / చరుము } | స | స్నేహాలేపనే / అవసేచనేచ | నెయ్యి మొదలైనవిపట్టించి రాచు / తడవుట |
| చఱు | స | ఆస్ఫాలనే | అప్ఫళించుట |
| చఱు | | ప్రహారే | కొట్టుట |
| | | అయఃప్రభృతిశలా | అయస్సు మొదలగునవి పొడి |
| | | కాకర్షణే | గించుట |
| చల్లు | స | ప్రోక్షణే | ప్రోక్షించుట |
| | | బీజావాపే | విత్తనము వేయుట |
| | | వికిరణేచ | వెదచల్లుట |
| చల్లారు | అ | ఊష్మశాంతౌ | వేఁడిలేనిదవుట |
| | | అగ్నిశాంతౌచ | నిప్పుశమించుట |
| చలివాపు | స | భయవారణేశసాం / త్వనే | భయముదీర్చి బుజ్జగించుట |
| చాఁచు | స | ప్రసారణే | ప్రసరింపఁజేయుట |
| చాటు / చాటించు } | స | వీథ్యాముద్ఘోష్యసర్వే / షాంజ్ఞాపనే | వీథిలోనుద్ఘోషించి యందఱకు / ను దెలియఁజేయుట |
| చాఁకు | స | శాణాదిషుఘర్షణే | సాన మొదలగువానిమీఁద రా / చుట |
| చాఁపు | స | ప్రసారణే | ప్రసరింపఁజేయుట |
| చాయు | స | ఖలాదౌసమ్మార్జన్యా / దినా ధాన్యాదీనాం / రాశీకరణే | కళ్ళము మొదలైనవానిలోఁ జీఁ / పురుకట్ట మొదలైనవానిచేత / ధాన్యములు ప్రోగుసేయుట. |
| చాలు | అ | పర్యాప్తౌ | పర్యాప్తమగుట |
| | | శక్తౌచ | శక్తుండగుట |
| చాలించు | స | కార్యవిరమణే | పని నిలుపుట |
| చాల్పడు | అ | యావత్పతనే | అంతయుఁబడుట |
| చిక్కు | అ | కార్శ్యే | కృశించుట |
| | | లాభే | లభించుట |
| | | శేషే | మిగులుట |
| | | హస్తగ్రాహేచ | చేతికిఁబట్టుపడుట |

| ధాతువు | | సంస్కృతార్థము | తెనుఁగర్థము. |
|---|---|---|---|
| చిక్కువడు | అ | తంతూనాం పరస్పరమేళనే | దారములు పరస్పరము మేళనముగుట |
| | | కష్టప్రాప్తౌ | కష్టమునొందుట |
| | | హస్తగ్రాహే చ | చేతికిఁ బట్టువడుట |
| చిక్కుకొను | అ | లగ్నతాయాం | అంటుకొనుట |
| | | పరాధీనతాయాంచ | పరాధీనుఁడవుట |
| చిగిర్చు<br>చిగిరించు | అ | పల్లవోత్పత్తౌ | పల్లవించుట |
| చించు | స | వస్త్రాదీనాం ద్వైధీకరణే | వస్త్రములు మొదలైనవానిని రెండుగాఁ జేయుట |
| చిచ్చికొట్టు | స | బాలానాం ప్రస్వాపనే | పిల్లకాయలను నిద్రపుచ్చుట |
| చిట్లు<br>చిటులు | అ | శుష్కఫలాదీనాం స్వతస్సశబ్దవిదళనే | ఎండినఫలాదులు తనకుఁదానె ధ్వనిగాఁ బగులుట |
| చిటాఁకించు గ్రా | స | కోపవికృతౌ | కోపము చేత వికృతమగుట |
| చిత్తగించు | స | బుద్ధ్యారోహే | బుద్ధికిఁ దెచ్చుకొనుట |
| చితుకు<br>చిదుకు | అ | విశీరణే | విశీర్ణమగుట |
| చిదుపు<br>చిదుము | స | మారణే | చంపుట |
| | | విశీర్ణకరణే చ | విశీర్ణముగఁ జేయుట |
| చిందు | అ | స్యందనే | ఒలుకుట |
| చినుకు | అ | వృష్టౌ | వర్షించుట |
| చినుఁగు | అ | వస్త్రాదిభేదే | వస్త్రాదులు బద్దలగుట |
| చిన్నవోవు | అ | ఖేదే | ఖిన్నుండవుట |
| చిప్పిలు | అ | ఉద్గమే | ఉబుకుట |
| చింపు | స | ఛేదనే | చినుఁగునట్లు చేయుట |
| చిముకు | అ | అతిపాకదూషితే | అతిపాకముచేతఁ జెడిపోవుట |
| చిమ్ము | స | అపనే | విరాటుట |
| చిరుఁగు | అ | వస్త్రాదిభేదే | వస్త్రాదులు ఛిన్నమౌట |
| చిరుతలువారు<br>చిరుతలుగమ్ము | అ | తేజోతిశయదర్శనేన చక్షుఃప్రతిఘాతే | మిక్కిలి తేజస్సును జూచుటచేతఁ గన్నులు చెదరుట |

| ధాతువు | | సంస్కృతార్థము | తెనుఁగర్థము. |
|---|---|---|---|
| చిఱుము | స | విశీర్ణకరణే | చికురుపట్టులు చేయుట |
| చిఱచిఱలాడు<br>చిఱ్ఱుబుఱ్ఱాడు | అ | కోపవికారే | కోపవికారము నొందుట |
| చిలుకు<br>చిల్కు | స | మథనే<br>ప్రోక్షణేచ | మథించుట<br>ప్రోక్షించుట |
| చిలకరించు | స | ప్రోక్షణే | ప్రోక్షించుట |
| చిక్వ | స | తక్షణే | చెక్కుట [ట |
| చివుకు | స | శైథిల్యే<br>ఆస్వాదవిశేషేచ | శిథిలమౌట, అవఁగాఁబ్రాఁతగిలు<br>ఫలాదులాస్వాదించుట |
| చీకాకుపడు<br>చీదరపడు | అ | వ్యాకులత్వే | వ్యాకులుండగుట |
| చీదు | స | నాసామలనిస్సారణ క్రియాయాం | చీమిడి పోవునట్లు చేసికొనుట |
| చీరు | స | భేదనే | బద్దలు చేయుట |
| చీఱు | స | ఆహ్వానే | పిలుచుట |
| చీలు | స | వంశాదిదళనే | వెదురు మొదలైనవి బద్దలవుట |
| చీవు | స | తక్షణే | చెక్కుట |
| చుట్టు | స | వేష్టనే | వేష్టనసేయుట |
| చుట్టుముట్టు<br>చుట్టుకొను<br>చుట్టవేయు | స | పరివేష్టనే | పరివేష్టించుట |
| చుఱుపుచ్ | స | దహనే | కాల్చుట |
| చూచు | స | దర్శనే | దర్శనము సేయుట |
| చూఁడు | స | దహనే | కాల్చుట |
| చూపట్టు | అ | దర్శనవిషయతా యాం | అగపడుట |
| చూపెట్టుకొను<br>చూపట్టుకొను | స | ప్రతీక్షాయాం<br>అనుపద్రవదర్శనావస్థానేచ | ప్రతీక్షించుట<br>ఉపద్రవము రాకుండఁ గాచుచుండుట |

| ధాతువు | | సంస్కృతార్థము | తెలుఁగర్థము. |
|---|---|---|---|
| దక్కు | స | తక్షణే | తక్షణము సేయుట |
| | | ఉపగూహనే | దోఁపుట |
| | | ఉపర్యుపరిఖననే | పయిపయిగాఁ ద్రవ్వుట |
| | | ప్రతివపనేచ | రత్నములు చెక్కనగియును |
| దక్కు చెదరు | అ | ఈషద్భంగే | ఈషద్భంగమగుట |
| దెంగు | అ | క్రీడాదిషుపరాభవే | ఆట మొదలైనవానిలోఁ బరాభూతుఁడగుట |
| దెంగలించు | అ | ప్రకాశే | ప్రకాశించుట |
| దెటాయించు(గ్రా) | అ | విరోధే | విరోధమవుట |
| దెట్టవట్టు | స | వివాహే | వివాహమవుట |
| దసు | అ | కార్యవైకల్యే | కార్యవైకల్యమగుట |
| దెణకు, దెణుకు | స | స్పర్శే | స్పృశించుట |
| దదరు, దదురు | అ | ఉత్పత్యకరితః ప్రసరణే | ఎగసియుంతటను బ్రసరించుట |
| | | సేనాపరాభవే | దండు పరాభూతమగుట |
| | | చలనేచ | కదలుట |
| ందు | స | ప్రాప్తౌ | పొందుట |
| నయు | స | స్పర్శే | స్పృశించుట |
| ప్పు | స | ఉక్తౌ | పలుకుట |
| మర్చు, మ్మటిలు, మ్మగించు | అ | ఆర్ద్రీత్వే | ఆర్ద్రిమాట |
| రువు | అ | ఉపగూహనే | దోఁపుట |
| రుగు | స | పరాపవనే | చేటతోఁ దవుడు మొదలైనది విడఁజేయుట |
| లుచు, రుపు | స | కార్యవైకల్యకరణే | కార్యవైకల్యము సేయుట |
| అలాను | అ | పప్రక్రీడాయాం | దరికోరాడు |
| లుము | స | లేపనే | రాచుట |

| ధాతువు | | సంస్కృతార్థము | తెలుఁగర్థము. |
|---|---|---|---|
| చెల్లు | అ | ఋణనిర్యాతనే | అప్పుదీఱుట |
| | | అప్రతిబంధే | ప్రతిబంధములేనిదవుట |
| | | మృతౌచ | చచ్చుట |
| చెలఁగు | అ | శోభాయాం | శోభించుట |
| చెలరేఁగు | అ | అతివ్యాప్తౌ | మిక్కిలి వ్యాపించుట |
| | | అత్యుద్ధతౌచ | మిక్కిలి నుద్ధతుండవుట |
| చేకుఱు } | | హస్తగతే | హస్తగతమౌట |
| చేకూఱు } | అ | ఆనుకూల్యేచ | అనుకూలమగుట |
| చేకూడు } | | | |
| చేటుమూఁడు } | | | |
| చేటుమూడు } | అ | దైవప్రాతికూల్యప్రాప్తౌ | దైవప్రాతికూల్యము పొందుట |
| చేడ్పడు } | | | |
| చేఁదు | స | నికురణే | బావి మొదలైనదానిలోనుండి నీళ్ళుచేఁదుట |
| చేఁపు | అ | క్షీరప్రస్నవే | పాలు ఉబుకుట |
| | స | క్షీరప్రస్నవకరణేచ | ఆవు పాలుబుకఁజేయుట |
| చేపడు | అ | హస్తగతే | హస్తగతమౌట |
| చేపట్టు | స | అవలంబే | అవలంబించుట |
| | | వివాహేచ | వివాహమగుట |
| చేమోడ్చు | అ | ప్రణామే | మ్రొక్కుట |
| చేయు | స | కరణే | సలుపుట |
| చేరు | స | ప్రాప్తౌ | పొందుట |
| | స | ఉపధానే | ఆనుకొనుట |
| | అ | హస్తగతేచ | హస్తగతమౌట |
| చేరుచు } | స | పుష్పాదిధారణే | పుష్పాదులు ధరించుట |
| చేర్చు } | | ప్రాపణేచ | పొందించుట |
| చొక్కు | అ | మత్తతాయాం | మత్తుగొనుట |
| | | శ్రాంతౌ | బడలుట |
| | | మృతౌచ | చచ్చుట |

| ధాతువు | | సంస్కృతార్థము | తెనుఁగర్థము. |
|---|---|---|---|
| చాఁచ్ }<br>చొత్తించు } | స | అంతఃప్రవేశే | లోపలికిఁ బ్రవేశించుట |
| చొనుపు | స | అంతఃప్రవేశనే | లోపలికిఁ బ్రవేశింపఁజేయుట |
| | | బాణప్రయోగేచ | బాణములు ప్రయోగించుట |
| చొప్పడు | అ | ఆనుకూల్యే | అనుకూలమవుట |
| చొప్పిల్లు | అ | ప్రకాశే | ప్రకాశించుట |
| చొరవేయు | అ | అంతఃప్రవేశే | లోపలికిఁ బ్రవేశించుట |
| | స | అంతఃప్రవేశనేచ | లోపలికిఁ బ్రవేశింపఁజేయుట |
| | | **జ** | |
| జంకు | అ | భయే | భయపడుట |
| జక్కించు | అ | అనవమృశ్యకరణే | విచారింపక చేయుట |
| జడియు | అ | భయే | భయపడుట |
| జడనుపడు | అ | బలహాన్యామాంద్యే | బలహానిచేత మందపడుట |
| జరుగు | అ | మనాగపసర్పణే | మెల్లగా నావలఁబోవుట |
| | | కాలగతౌచ | కాలము గడచుట |
| జల్లించు | స | తితఉభ్రామణేనశోధనే | జల్లెడలోఁ ద్రిప్పి పరిశోధించుట |
| జల్లను }<br>జల్లుమను }<br>జలదరించు } | అ | అనిష్టదర్శనశ్రవణాది జన్యకంపస్వేదపులకోద్భేదాద్యా | అనిష్టవస్తువును జూచుటవలననైన వినుటవలననైన శరీరము కంప స్వేదరోమాంచాదులుగలదౌట |
| జవుకు | అ | | కురుపు మొదలైనది మెత్తగిలుట |
| జవురు | స | రజ్వాదినాతాడనే | త్రాడు మొదలైనవానితోఁ గొట్టుట |
| | | సమూహనేచ | ప్రోఁగుగాఁజేయుట |
| జవురుకొను | స | సమూహ్యగ్రహణే | ప్రోగుగాఁజేసి యెత్తికొనుట |
| జాడించు | స | జలేవస్త్రాదిప్రక్షిప్య మాలిన్యాపనయనే ప్రహారేచ | జలమునందు బట్ట మొదలైనదానిని వేసి మైలపోఁ గొట్టుట కొట్టుట |

| ధాతువు | | సంస్కృతార్థము | తెలుగర్థము. |
|---|---|---|---|
| జాఱు | అ | పలాయనే | పలాయితుండౌట |
| | | గ్రంథివిస్రంసే | ముడివిడిపోవుట |
| | | పాదాదిస్ఖలనభేదే | కాలు మొదలైనది స్ఖలనమగుట |
| | | జలస్రావే | నీళ్ళు స్రవించుట |
| | | అపరాధే | తప్పుట |
| | స | విసర్జనేచ. గ్రా | విడుచుట మాటజాఱెనని |
| జాల్గొను | అ | ప్రవాహే | ప్రవహించుట |
| జితపడు | అ | అభ్యాసే | అభ్యస్తమగుట |
| | | అనుకూల్యేచ | అనుకూలించుట (ఒంబెవరుట) |
| జిలుగు | స | శ్లిష్టసూక్ష్మలిఖనే | ఒకదానితోనొకటి కలియునట్లు సన్నముగా వ్రాయుట |
| జీరు<br>జీరాడు<br>జీరుకాడు | అ | లంబనే | వ్రేలుకాడుట |
| జుణగు<br>జుణుగు | అ | పరాగతౌ | వెనుకందీయుట |
| జుఱ్ఱు | స | చోషణే | పాయసము మొదలైనది నోటితో ధ్వనిగా గ్రహించుట |
| జేవురించు<br>జొత్తిల్లు | అ | అరుణీభావే | ఎఱ్ఱనవుట |
| జొబ్బిల్లు | అ | ఉద్గమే | ఉబుకుట |
| జోకొట్టు | స | బాలాననునీయ ప్రస్వాపనే | పిల్లకాయల నూరార్చి నిద్రపుచ్చుట |
| జోకు | స | ఉపాలంభే | తిట్టుట |
| జోడించు | స | ద్వితీయేనసంయోజనే | రెండవదానితోఁగూర్చుట |
| జోపు | స | అపనోదనే | ఆవలందోయుట |
| జోలపాడు | స | బాలాననునీయ స్వాపనే | పిల్లకాయలనూరార్చినిద్రపుచ్చుట |

| ధాతువు | | సంస్కృతార్థము | తెలుఁగర్థము. |
|---|---|---|---|
| | | **ట** | |
| టక్కు<br>టక్కుచేయు<br>టక్కులాడు | స | ప్రతారణే | వంచనసేయుట |
| | | **డ** | |
| డగ్గఱు | అ | సన్నిధానే | సమీపించుట |
| డస్సు గ్రా | అ | మృతౌ | చచ్చుట |
| డయ్యు | అ | బలహానౌ | బలహీనుఁడగుట |
| డాఁగు | అ | అదృశ్యతాయాం | అదృశ్యుండవుట |
| డాసలించు | అ | పార్శ్వదేశప్రాప్తౌ | ప్రక్కఁజేరుట |
| డాయు | స | సన్నిధానే | సమీపించుట |
| డిగు<br>డిగ్గు | అ | అవతరణే | దిగుట |
| డిందు | అ | మృతౌ | చచ్చుట |
| డిందుపడు | అ | బలహానౌ | బలహీనుండవుట |
| డిల్లపడు | అ | నిశ్చేష్టతాయాం | నిశ్చేష్టుండవుట |
| డీకొను | స | కలహాభ్యుత్థానే | ఎదిరించుట |
| డీలుపడు | అ | బలహానౌ | బలహీనమవుట |
| డుయ్యు | అ | ఘః ప్ట్యాదితో నిస్సరణే | పిడికిలి మొదలైనదానివలన జాఱిపోవుట |
| | | పరాగతౌ | వెనుకదీయుట |
| | | విస్రస్తౌచ | విచ్చిపోవుట |
| డుల్లు | అ | పతనే | పడుట |
| డులుచు | స | అవస్రంసనే | వదిలించుట |
| | | పాతనేచ | పడవేయుట |
| డెక్కు | స | అవరోధనే | అడ్డగించుట |
| డొంకు | అ | హ్రైస్యే | తగ్గిపోవుట |
| డొల్లు | అ | పతనే | పడుట |
| | | పరివర్తనేచ | పొర్లుట |

| ధాతువు | | సంస్కృతార్థము | తెలుఁగర్థము |
|---|---|---|---|
| **త** | | | |
| తక్కు | అ | శేషే | మిగులుట-తక్కినదియని |
| | | పరిహారేచ | పరిహరించుట-పోకతక్కనని |
| తగు | అ | అర్హతాయాం | అర్హుఁడవుట |
| తగ్గు | అ | హ్రాస్వే | తక్కువగుట |
| తగులు | స | ప్రాప్తౌ | పొందుట |
| | స | స్పర్శే | అంటుట |
| | అ | లగ్నేచ | పట్టుపడుట |
| తగుల్పడు | అ | లగ్నే | పట్టువడుట |
| తగులుకొను | అ | లగ్నే | పట్టువడుట |
| | | దగ్ధేచ | కాలుట |
| తగలవేయు | స | దహనే | కాల్చుట |
| | | వ్యతిషంజనేచ | అంటునట్లుచేయుట |
| తగలఁబడు | అ | దగ్ధే | కాలుట |
| త్రచ్చు | స | మథనే | మథించుట |
| తట్టు | స | తాడనే | తాటించుట |
| తటాయించు గ్రా | స | నిర్భిద్యగమనే | భేదించుకొనిపోవుట |
| తడయు | అ | ఆలస్యే | ఆలస్యముసేయుట |
| తడియు | అ | ఆర్ద్రీభావే | ఆర్ద్రమవుట |
| తడవు<br>తడువు | స | ఆమర్శనే | అంతటస్పృశించుట |
| తండు | స | దేయార్థోద్గ్రహణే | ఈవలయునర్థమును రాఁబట్టుట |
| తడఁబడు<br>తత్తఱిలు<br>తత్తరిల్లు<br>తత్తరపడు<br>తత్తరకొను | అ | సంభ్రమే | తొట్రుపడుట |
| తందరిలు<br>తందరిల్లు | అ | సంభ్రమే | తొట్రుపడుట |
| తన్ను | స | పాదతాడనే | పాదములతోఁగొట్టుట |

| ధాతువు | | సంస్కృతార్థము | తెనుఁగర్థము. |
|---|---|---|---|
| తళుకు<br>తళరు<br>తళర్చు | అ | ప్రకాశే | ప్రకాశించుట |
| తనియు | అ | తృప్తౌ | తృప్తిఁబొందుట |
| తన్నుకాడు | అ | పిష్టపేషణేనావిమోచనే | పట్టినదిపట్టుగా విడువనివాఁడౌట |
| | | స్వయంస్వపాదతాడనే | తన్నుఁదానుదన్నుకొనుట |
| | | అన్యోన్యపాదతాడనేచ | ఒకనినొకండు తన్నుకొనుట |
| తన్నులాడు | అ | అన్యోన్యపాదతాడనే | ఒకనిచేతనొకండుతన్నువడుట |
| తప్పు | స | అతిక్రమే | అతిక్రమించుట |
| తమకు | అ | చలనే | కదలుట |
| | | పరాగతావిత్యేకే | వెనుకకుఁదీయుట |
| తమకించు | స | అత్యనురాగే | మిక్కిలియనురాగముఁబొందుట |
| తరలు | అ | చలనే | చలించుట |
| | | నిర్గమనేచ | బయలువెళ్లుట |
| తర్లు | అ | ప్రస్థానే | పయనమగుట |
| తరు | స | మథనే | మథించుట |
| తరతరలాడు | అ | అతిసంభ్రమే | మిక్కిలితొట్రుపడుట |
| తఱుగు | స | హీనతాయాం | తక్కువౌట |
| | | ఫలాదీనామవఖండనేచ | ఫలాదులు రెండుచేతులతోఁబట్టుకొని కోయుట |
| తఱుము | స | ధావతోనుధావనేన వేగజననే | పరుగెత్తువానివెంబడిఁ దానును బరుగెత్తుచు వానికివేగముపుట్టించుట |
| | | ఆక్రమణే | ఆక్రమించుట |
| | | శాణోల్లేహనే | తేటమెనపట్టుట |
| తఱిము | స | ధావతోనుధావనేన వేగజననే | పరుగెత్తువాని వెంబడిఁ దానును బరుగెత్తుచు వానికివేగముపుట్టించుట |

# విషయసూచిక.





# పరిషత్ప్రయోజనములు.



తెలుఁగుభాషను, వాఙ్మయమును, అభివృద్ధి నొందించుటయు, ఆవిషయమునఁ బరిశ్రమ చేయువారలకుఁ బ్రోత్సాహ మొసంగుటయు నీపరిషత్తుయొక్క ప్రయోజనములు. ఈపనిని నెఱవేర్చుటకై యవలంబింపఁదగు మార్గములలోఁ గొన్ని యిక్రిందఁ బొందుపఱుపఁబడి యున్నవి :—

i తెలుఁగుభాషలోని పదములకు వ్యుత్పత్తి నెఱుఁగువానిని నిరూపించుచు లక్ష్యసహితముగ నర్థము వివరించు సర్వాంగసమగ్రనిఘంటు వొకటి రచించి ప్రచురించుట ;

ii తెలుఁగుభాషకు సజాతీయేతరభాషలతోఁ గలసాదృశ్యములను సాకల్యముగ నిరూపించుచు నొకవ్యాకరణమును రచించి ప్రచురించుట ;

iii ఆధునికశాస్త్రగ్రంథరచనయందుఁ బ్రయోగించుటకై పారిభాషికపదములను నిర్ణయించి వివరించు నొకశబ్దకోశమును సిద్ధముచేయుట ;

iv ఆంధ్రదేశప్రాచీనచరిత్రాంశపరిశీలనకుఁ బ్రోత్సాహ మొసంగుటయు, లభ్యము లయిన వానిలో మిక్కిలి విశ్వసనీయములైన యాధారముల సాహాయ్యమున సవిస్తరముగాఁ దెలుఁగుదేశముయొక్కయుఁ బ్రజలయొక్కయుఁ జరిత్ర మొకటి రచించి ప్రచురించుటయు ;

v సర్వవిషయములనుగూర్చి చేయఁదగు గ్రంథరచనకుఁ బ్రోత్సాహ మొసంగుట ;

vi ఆంధ్రభాషలోని మంచిగ్రంథములఁ బండిత పరిష్కారము చేయించి నిర్దుష్టముగఁ బ్రచురించుట ;

vii తెలుఁగుభాషకును వాఙ్మయమునకును సంబంధించిన విషయములను జర్చించు నొక పత్రికను బ్రకటించుట ;

viii తెలుఁగువాఙ్మయమునకు సంబంధించిన విషయములను గూర్చి చర్చించుటకుఁగాను సాంవత్సరికసభల నేర్పాటుచేయుట ;

ix తెలుఁగు సాహిత్యవిషయమునఁ బరీక్షలఁ గావించి పారితోషికములను, సాహిత్య పట్టములను, యోగ్యతాపత్రికలను, నొసంగుట ;

x ఒక పుస్తకభాండాగారమును స్థాపించి పోషించుట. ఇందుఁ బ్రధానముగాఁ దెలుఁగు గ్రంథము లుండవలయును ; ప్రాఁతప్రతులుగూడ నుండవలయును ;

xi తెలుఁగుభాషయొక్కయు వాఙ్మయముయొక్కయు నభివృద్ధికి నుపకరించు నన్ని కార్యములను జేయుట.